# LAKSHMI VILAS

Elementary Telugu Books.

# Advice to Kumara

## కుమార శతకము



SUITED TO
THE ASPECTS OF
PSYCHICAL LIFE
OF THE CHILD

by
N. CHALAPATI RAU

1920
M. V. Press, Ellore.

# LAKSHMI VILAS ELEMENTARY

## TELUGU

# Reading Books

## కుమారశతకము

## ADVICE TO KUMARA

**Suited to the Aspects of Psychical Life of the Child**

By

N. Chalapati Rau

**1920**

Manjuvani Press, Ellore.

# PREFACE.

The world is now witnessing most remarkable forward movements in Elementary education. Vaguely conceived ideals, which were at one time said to belong to a 'range of faculty beyond the grasp of the teacher in the class room,' is now taken into account as a practical administrative phase of ordinary every day school work.

The Morven Garden School, North Sydney, Australia conceived a practical curriculum which best serves the purposes of life by quickening the desire for self reliance.

The sixfold division of character into (1) Intellectual, (2) Working, (3) Personal (4) Social, (5) Emotional, (6) Physical, is well conceived to suit the exegencies of Child Psychology.

I am convinced that the chart (curri culum) is perfectly sound and advantageous to the child.

When the Elementary School period is limited, the child is immature, the present day living needs are pressing, the teachings of different schools are abundant, there is need of selecting with care, material that would enable the child to acquire with ease, capacity to devise means and to employ them for the progress of life.

There are several "advice to children" Books in Telugu Literature and I cannot improve on them, but several of them are not written from the point view of the child and brought within the of his understanding.

The present is an humble attempt to place before the child, in his mother tongue, the great chart of character building with a few hints on Sanitation Civics, and Economics than which nothing is more wanting.

During the period of Elementary training Psychology does not differentiate sex, nay, the Hindu Home, for the matter of that, any home does not distinguish sex at that age and all children, sisters and brothers read and eat, play and sleep together and the Garden School Chart does not differentiate too, sex in the child.

In versification I have endeavoured to keep that principle and only changed *Kumara* into *Kumaree*, according to the genious of the Telugu Language.

If this publication earns any appreciation, it should be credited to the account of the frames of the chart of the Garden School, Australia and the New India for its publication and for defects and shortcomings I am solely responsible.

With a view that Telugu Scholars, better qualified than myself, might suggest better versification, I have appended the original chart with apologies to the Morven Garden School authorities.

I request the teacher who happens to handle this book to refer to the English chart, whenever my interpretation is found wanting in felicity of expression.

Ellore
15-2-1920

N. Chalapati Rau.

# CHART.

## INTELLECTUAL CHARACTER

needed for wise thinking.

1 Earnest, not trifling
2 Sincere and open-minded, not diverted by personal interests
3 Discerning not superficial
4 Alert not indolent
5 Accurate, not indefinite
6 Useful in thought, not merely interesting
7 Inventive and constructive, not lacking initiative
8 Rational and judicious, not over emotional, hysterical or melancholy
9 Thorough, not illogical
10 Keen perceptious, not unobserving
11 Retentive memory, not forgetful
12 Inquisitive, not lacking desire to know

## WORKING CHARACTER

needed for doing useful work.

1 Purposeful, not led merely by likes and dislikes
2 Teachable, not stubborn
3 Obedient, not balky
4 Cautious, not heedless

5 Ambitious not self-satisfied
6 Persistent, not vacillating
7 Industrious and energetic not lazy and dilatory
8 Attentive, not careless
9 Decisive, not procrastinating
10 Progressive, not opposed to change
11 Thrifty, not wasteful
12 Artistic, not slovenly
13 Adaptable, not slow to fit into new surroundings
14 Executive, not haphazard

## PERSONAL CHARACTER

needed for doing right by oneself

1 Thoughtful, not merely impulsive
2 Influenced by high ideals, not content with low standards
3 Conscientious, not lawless
4 Independent, not suggestible
5 Self-controlled, not weak
6 Refined, not coarse
7 Self-respecting, not dissipated

## SOCIAL CHARACTER

needed for doing right by others

1 Genuine, not affected
2 Honest, not thieving nor disposed to cheat
3 Truthful not given to lying and deceiving
4 Honorable, not sneaking
5 Just, not unfair

6 Harmonious, not wrangling
7 Forgiving not vindictive
8 Disposed to trust others, not suspicious
9 Sociable, not exclusive nor snobbish
10 Loyal, not treacherous
11 Pure, not lewd
12 Courteous, not rude
13 Tactful, not brusque nor priggish
14 Generous and sportsmanlike, not stingy nor jealous
15 Public spirited and patriotic, not selfish
16 Respectful, not impudent nor flippant

EMOTIONAL CHARACTER

needed for the joy of living

1 Courageous, not timid
2 Capable of true love, not cold hearted
3 Kindly, not cruel not hateful
4 Sympathetic, not self centred
5 Congenial, not repulsive
6 Responsive to the beautiful, not indifferent
7 Alive to truth, not uninterested
8 Devoted to righteousness, not inclined to evil
9 Humble, not conceited
10 Patient, not irritable
11 Tolerant and with a sense of humour, not angry over differences of opinion
12 Hopeful, not pessimistic
13 Reverent, not irreligious
14 Friendly, not lacking good will

15 Grateful, not unappreciative of kindness

## PHYSICAL CHARACTER

### needed as a basis for human life

1 Well-developed body, nor poorly nourished
2 High resistence to disease, not susceptible
3 Vital, not sluggish
4 Ready muscular control, not bungling
5 Endurance, not quickly tired
6 Strength, without disabilities
7 Grace of figure and carriage, not frumpy
8 Expressive face, not stolid
9 Strong, musical voice, not choked or rasping



## కందము

బాలమనస్తత్త్వంబును
జాలంగా నందిరాజు చలపతిరాపి
లీలఁ బరిశోధ యొనరిచి
బాలలకు హితంబుగఁబుస్వ్రాసెఁ గుమారీ!

శ్రీపరమాత్మనే నమః

# కుమార శతకము.

:‌:o::

కం. శ్రీయుననారోగ్యంబును
శ్రేయంబును నీతి విద్య చిత్తవికాసం
బాయుర్భాగ్యమునీకు స
దా యిమ్మత్సం బదాత్పరుండు దయను గుమారా!

## బుద్ధి ప్రాభవము.

కం. కనఁదగుసకలము శ్రద్ధం
గొనకొనికనవలయునేలోకోక్తి యిదినాకం
చును జూచీచూడక విడి
చిన లోకజ్ఞాన మెటులఁజెలఁగుఁ గుమారా!

కం. నిష్కపటవృత్తినుండుము
శుష్కస్వార్థైకపరతఁజొప్పడి జ్ఞానా
విష్కారము సకలంబు బ
హిష్కారముసేయబోకు మెపుడుఁ గుమారా!

కం. తెలిసికొనునెడల నీకుం
దెలిసినదే చాలుననుచుఁ దృప్తిపడక క్రొ
త్తలెఱుఁగఁ జిత్తద్వారము
సలలితముగఁ దెఱచియుంచఁ జనును గుమారా!

కం. పై పై నిఁ జూచియింతే
యీపై నిక నేమిలేదటంచు వదలకే
యోపికమై లోఁతుకు దిగి
దీపింపఁగ దేనినేనిఁ దెలియు కుమారా! 4

కం. మనుదిన్న పాము చందం
బునఁగడు సోమరితనంబుఁబూనక చులుకుం
దనమున బుద్ధిని సాలో
చన మార్గంబునకుఁ ద్రిప్పఁ జనునుఁ గుమారా! 5

కం. తెలియందగునది యెల్లను
దెలియుము రూఢముగనింత తెలిసియునంతేఁ
దెలిసిన రీతిగ మెలఁగకు
మిల మిడిమిడి జ్ఞానమెపుడహితము కుమారా! 6

కం. కేవల వినోదమాత్రం
బై వరలక సోపయోగమై వర్తిలు త
ద్భావము రమ్యంబగుఁ గద
కావున నాభావములకుఁ గడఁగు కుమారా! 7

కం. నవనవ యంత్రాదికములఁ
దవుగతి నిర్మింప బుద్ధిఁ దరతరము కుశా
గ్ర విధిగ వాఁడినిఁజేయుమ
నవరతము జగదుపకారమగును గుమారా! 8

కం. మనసునకుఁదోఁచినట్టులఁ
జని మోహామునందుఁబడి విషాదభరంబుం

గొనక నవిమర్శము నకా
రణమగు వాదమునలుపు చిరమును కుమారా! 9

కం. దైవ విలాసముఁజూపెడు
కేవలపరిపూర్ణ భావ కీలితమతితోఁ
గావింపు సదాలోచన
వావిరి సత్తర్కములను పలదు కుమారా! 10

కం. అవధాన శూన్యవృత్తిని
నవలోకింపంగనెద్దియైనను దృష్టం
బవునే? సూక్ష్మగ్రహణత
నవధానతఁగలిగి యుండుమయ్యా! కుమారా! 11

కం. గ్రహియించినట్టి దెల్లను
నహరహంబును మఱచిపోక యద్దాని సదా
విహితము ధారణచేయుట
యిహపరముల కదియె త్రాణ మెపుడుఁ కుమారా! 12

కం. ప్రకృతింగనఁబడుకార్యము
లకుఁ గారణములరయు నభిలాషోర్మికదం
బకములఁ బుట్టింపుము నీ
ప్రకటంబగు చి[illegible]రమునఁ కుమారా! 13

## క్రియాశక్తి.

కం. నీయిష్టమైనదానినిఁ
జేయుచనిష్టంబులగును ద్యజించుటయున

న్యాయము! ప్రయోజనమై క
శ్రేయస్కర కార్యములను జేయు కుమారా! 14

కం. గురువుల యుపదేశంబుల
భరియింపఁగ నర్హమైన పద్ధతులందున్
స్థిరముగ బుద్ధిని మలపుము
కరంబు దుర్గముని పగిదిఁగాకు కుమారా! 15

కం. వినయంబె జీవితో త్తే
జనమునకును సానరాయి జగతినిదానిం
గొని కాపాడక కమదు
ర్వినయమునంబాదుసేయ వెడఁగు కుమారా! 16

కం. రానున్న కీడులకుఁగా
మానసమున సరకుఁగొనక మనలకయెపుడుం
బూనుము జాగ్రద్వృత్తిని
దానన్ సౌఖ్యంబునీకుఁ దగును గుమారా! 17

కం. ఉత్తమపదవింబొందఁగఁ
జిత్తంబునయందుఁగాంక్ష సేయుము కానీ
బొత్తిగను నున్నదానని
హత్తింపకుమయ్య ముదము నాత్మఁ గుమారా! 18

కం. చంచల వృత్తినిమదిని ల
గించక గడుఁబట్టుదలను గీల్కొల్పుచుఁగా
వించినచోఁ గార్యములు న
మంచితగతి సఫలితంబులగును గుమారా! 19

కం. కష్టపడి పనులుజేయుము
భీష్టముసిద్ధించుదాఁక బిగువునఁ గానీ
కష్టపడ బద్ధకముపడ
నష్టంబులు గలుగునీ కనయము కుమారా! 20

కం. చేయఁదగుకార్యపట్లను
జేయక నిర్లక్ష్యవృత్తి స్థిరచిత్తమునం
జేయుములక్ష్యంబుంచుచు
నేయేయేకార్యంబులైన నెసఁగుఁ గుమారా! 21

కం. ఎప్పుడుచేయందగినది
యప్పుడెకావింపుకాని యదియెప్పటికో
చొప్పడుపఁ గప్పగంతుల
చొప్పనఁ గార్యంబుచెడును సుమ్ము కుమారా! 22

కం. అలదేశకాలపాత్రం
బులచేసగు మారువులను బొందుచునుండన్
వలెఁగాని ప్రాఁతదారిని
నలవడియుది విడివకుంటయుగునె? కుమారా! 23

కం. మితముగ వ్యయమునుజేయుచు
సతతము ధనసంగ్రహంబు సలుపుముకానీ
వితగా దూబరతనమున
కతిమాత్రంబు నలవడకుమయ్యా! కుమారా! 24

కం. ఏపనియందేఁ బూనుము
నైపుణమును నెడ్డితనమునం జేయకుమా!

యేపెద్దలై ననీయెడఁ
జూపుదురాదరువు దాన శోభ కుమారా! 25

కం. నీసరి వారలతోడ స
దా సరితూఁగుచును వారితత్తతున్నగుణా
భ్యాసంబును గావింపుము
వేసారక గలుగు సౌఖ్యవృద్ధి కుమారా! 26

కం. భగవంతుని దయయుండిన
నగుగాఁ గార్యంబు లెల్లననుచుండక పెం
పుగ కార్యనిర్వహణ శ
క్తిఁగడింపఁ గవలెను దానఁగీర్తి కుమారా! 27

## ఆత్మోత్కర్షము.

కం. ఆవేశ వశమునంబడి
కేవల సచ్చింతనములఁ గీడ్పడఁజేయగాం
గావలదు నీదుశీలము
తావై యుండ వలె శాంతతకును గుమారా! 28

కం. లోకోత్తర సంకల్పము
లేకావింపంగ వలయు నెల్లపుడటులం
గాకల్పమాత్రకోరినఁ
జేకురు నల్పిష్ఠ ముగను సిద్ధికుమారా! 29

కం. మంచియిది చెడ్డయిది యని
యెంచిప్రవర్తింపవలయు నెప్పుడునుఁదగం

గించి దధర్మ్యంబునుమ
న్నించి చరింపంగరాదునీకుఁగుమారా! 30

కం. జ్ఞానమునం దగ్గి పరా
ధీనుఁడ వైయుండ వలదు తేఁకువతోఁ దగ
మానసిక స్వాతంత్ర్యము
బూనంగాఁజేయు యత్నములను కుమారా! 31

కం. బలవంతములగు నింద్రియ
ముల వశమునబడుదువేని మోహాత్ముఁడ వై
బలహీనుఁడ వై పోదువు
పొలియును నీధర్మనియతబుద్ధి కుమారా! 32

కం. మాన్యత్వం బలవడు సౌ
జన్యంబగువర్తనమున జగతినిఁ గాన
దైన్యము నసభ్య వర్తన
హైన్యంబునుబొందఁ బోకుమయ్య కుమారా! 33

కం. అనయంబునాత్మగౌరవ
మును గాపాడుకొనుటయున ముఖ్యముదాన
జనములు నినుహర్షింతురు
జనకుమొకప్పుడును వీచ సరణిఁ గుమారా! 34

## సాంఘిక గుణము.

కం. కృత్రిమనటనంబులతోఁ
ధాత్రినిఁజరియింపఁబోక తథ్యంబగు చా

రిత్రంబున వర్తిలుచుఁ బ
వి(త్రుఁడవను పేరుపొంది వెలయు కుమారా! 35

కం. మోసము దొంగతనము న
భ్యాసముసేయుంగఁబోకు మందఱు నిది సే
బాసన ఋజుమార్గంబునఁ
బో సరిసుద్ధానమేలు పొసఁగుఁ గుమారా! 36

కం. అత్యాశాబద్ధుఁడవై
నిత్యంబన్నృతంబులాడ నీకుందగునా?
వ్యత్యయమైనను గానీ
సత్యంబేమాటలాడఁ జనునుఁ గుమారా! 37

కం. గౌరవమైన విధిని సం
చారముచేయుము సతంబు సత్పురుషుఁడవై
చేరకు కాపురుషుఁడవై
నీరస దుష్పథమునందు నీవు కుమారా! 38

కం. నలుగురికోడఁబాటగు న
ట్టులచరియింపంగవలెఁ గడుంగడుఁబేర్మిన్
దలఁపకు నీపథమున నే
మెలఁగన్ వలె నలుగురనుచు, మేలు కుమారా! 39

కం. చీటికి మాటికి జగడము
లాటలుయుక్తములుగావ, యందఱితోడన్
పాటింపు మైకమత్యము
చేటొదవును లేనియెడల క్షితినిఁ గుమారా! 40

కం. కసిఁదీర్చుకొనుటకై మా
నసముం దుష్కార్యమందునం జొనుపకుమా
యసదృశ కరుణామతివై
మసలుము రిపులఁ క్షమించిమహినిఁ గుమారా! 41

కం. నమ్మము నమ్మింపుము సత
తమ్మనుమానమ్మునందుఁ దగులుకొనియుఁ జి
త్తమ్మును వ్యథపెట్టక ని
త్యమ్మును సంశయముయమాని యలరుకుమారా! 42

కం. సలలితముగఁ బలువ్రుతితోఁ
గలసియు మెలసియుఁ జరింపఁగావలయు నుమా
యిలనొంటిరితనమూనినఁ
బలుకష్టములగును నందువలనఁ గుమారా! 43

కం. తలఁపకు ద్రోహంబొరులకు
సలుపఁగ, నెల్లరును దైవసములంచు మదిం
దిలకింపుము స్నేహమ్మున
చెలికాడమె సౌఖ్యములనుజేయుఁ గుమారా! 44

కం. రాగాధిక్యముచేతను
భోగాసక్తుఁడవుగాక పూతమతివినై
సాగింపుశుద్ధవర్తన
నొఁగద నద్దాన సుఖము లవనిఁ గుమారా! 45

కం. ఏయేవేళలయందున
నేయేమర్యాదఁ జూపహితమో యటులఁ

న్యాయముజూపఁగ నయ్యది
శ్రేయముఁ మోటుందనంబు చెడుగు కుమారా! 46

కం. ఏతీరుపనినిఁగానీ
చాతుర్యముఁతోడఁ జేయఁజాలు మ యొప్పును
జాతుర్యము లేకుండిన
నాతతదంభమునఁ గార్యమగునె? కుమారా! 47

కం. పరకీయోత్కర్షమ్మును
భరియింపుమ యీసులేక పౌరుషమదియే
కరముం దా తృత్వంబును
వరియించియు లౌభ్యవృత్తి పదలుకుమారా! 48

కం. దేశాభిమానమునకై
నీశక్తిని ధారవోసి నెగడుము మిగులం
గ్లేశపడియైన దగదు దు
రాశయు స్వార్థైకపరత యవనిఁ గుమారా! 49

కం. గౌరవవృత్తి మెలంగుట
నేరిచికోఁదగును దుర్నీతి పథమునం
జేరకు మొకానొకప్పుడు
పూరుషునకు ధర్మమదియు పొలుచుఁగుమారా! 50

## మ నో భా వ ము

కం. పిఱికిఁదనంబున నేదియు
పరిగాదు సమగ్రధైర్య సాహసములచే

నరమరిక లేక సకలము
సరియగుటఁ గాంచిచూడఁ జనును కుమారా! 51

కం. వాస్తవిక ప్రేమ న
మస్త జనశ్రేణియందు నగపడుచుండుటే కా
ర్యస్తోమమగును దానఁ బ్ర
శస్త ముదాసీనబుద్ధి జనదు కుమారా! 52

కం. క్రూరాత్మత్వము ఘోరా
కారములగు జంతువులది, కావునఁ గరుణా
సారప్రచారమతివై
యేరి ననహింసపకుంట హితము కుమారా! 53

కం. నాకారోగ్యముమరియున్
నాకాయుష్యంబటని మనంబునఁ దలఁపం
బోక దయనీయులందున
సాకల్యముగాఁగఁజూపు జాలిఁ గుమారా! 54

కం. తలలోని నాల్కవలె లో
కులకందఱకును మహానుకూలుండవుగా
మెలఁగుము నిరాకరించుట
బలహీనులనేని నీకువలదు కుమారా! 55

కం. ఆమోదనీయముల యెడ
నామోదింపక తటస్థతాయత్తుఁడ వై
తే మహిని రమ్యవస్తుల
సామంజస్యంబులడఁగు సరవిఁ గుమారా! 56

కం. నిరతము సత్యాన్వేషణ
పరబుద్ధివి కమ్ముగాని భరమిాపని నె
వ్వరు బూనుదురని మదిలో
విసనంబుగఁ దోసివేయ వెడఁగు కుమారా! 57

కం. చెడుపనులుచేయుతలఁ పే
ర్పడనీయకు దానివలనఁ బాపంబగు నె
ప్పుడు సాధువృత్తినుండం
గడఁగుము కళ్యాణచయము కలుగు కుమారా! 58

కం. నమ్రుఁడవుకమ్ము ఫల భా
రామ్రమువలె సంతెగా కహంకృతికలనన్
సామ్రాజ్యమందునుండిన
కమ్రగతిం నిక్కఁబోకు కడఁకఁ గుమారా! 59

కం. చిఱుచిఱులాడకుమా యె
వ్వరిపీక్షించినను గాని వర్తిల్లఁదగున్
నిరతంబోపికతోడను
నరుడుగ కార్యములుదాననగును గుమారా! 60

కం. భిన్నాభిప్రాయము లోక
టన్నగడఁగఁ గోపమూనుటలు గూడదు త్వ
ద్భిన్నులకు నీమతంబును
భిన్నముగాఁ దోఁచుఁగాదె పృథివిఁ గుమారా! 61

కం. భయపడి యేపనిచేయుట
కయిన హాతాశుండవగుచు నాఁగక యుత్సా

వాయుతాత్ముఁడవై చేయఁగఁ
బ్రయతింపుము దానిసీకు ఫలము కుమారా! 62

కం. లోకేశ్వరుఁడొకఁడున్నాఁ
డా! కలియుగమందటంచు నాక సతంబుల్
లోకేశ్వరుఁడున్నాఁడని
జేకొని మదిభక్తితోడఁ జెలఁగు కుమారా! 63

కం. మంచిమనసు తోడంగా
వించుము స్నేహంబుఁ దోడి పిల్లలతోడన్
మంచిది నీకది మూర్తి భి
గించుక కూర్చుండ నీకుఁ గీడు కుమారా! 64

కం. మఱువకు ముపకారంబును
నెరయింపు కృతజ్ఞ బుద్ధి నిచ్చలముగ స
త్పురుషుని కీరితి తీవకుఁ
బరఁగు నిది యుపఘ్న మగుచు వసుధఁ గుమారా! 65

# శ రీ ర ప్ర కృ తి

కం. సర్వాంగ సౌష్ఠవోన్నతి
సర్వాంగానలయునట్టి పలుసాధనముల్
నిర్వహించుము సతతము
ఖర్వ ప్రాభవముతోడఁ గడఁకఁ గుమారా! 66

కం. శారీరబలము నిస్తుల
మై రాజిల నిన్ను వ్యాధులంటఁగ వెఱచున్

నీరసపడి లుగచెడ వే
మారుగ నిను వ్యాధులంటిమాద్చుఁ గుమారా! 67

కం. జీవ విశ్వాసశక్తికిఁ
దావలమగు నంగబలముఁ దగియుండవలెన్
గావలె నంగబలంబే
కేవలముగబుద్ధి బలము కెరలఁ గుమారా! 68

కం. ఏయది చేయంబూనిన
నీయావచ్ఛక్తి నింపి నెఱవేర్పఁ దగున్
జేయకు మనైపుణంబున
నేయది సిద్ధింపకుండు నెప్పుడుఁ గుమారా! 69

కం. కించిత్కార్యంబే గా
వించియు నలసటవహించి పిఱుతివియక వీ
క్షించియును గార్యపరిమితిఁ
బంచుము నీశక్తిదాని పయినిఁ గుమారా! 70

కం. మోయఁగరానిది మోయకు
చేయంగారానిదాన్ని జేయకు దానన్
నీయంగము వికలంబయి
పాయును నుపయోగ భాగ్య భరముఁ గుమారా! 71

కం. వంగుచు వ్రాలుచు సోలుచు
నింగిం జూచుచును మిగులని క్కుచునడవన్
వెంగలివందురు గావున
నంగుగ నడవంగవలయు నయ్యా! కుమారా! 72

కం. శ్రీయుతప్రసన్నవదనుఁడ
వై యుండుము కళలుదొలుకు నా శశి కరణిన్
హేయమగు దరిద్రలక్ష్మికిఁ
బ్రాయిల్లను మొగముఁజూపవలదు కుమారా! 73

కం. ఏభాషకు ననుగుణమగు
నాభాషా స్వరవిశేష మభ్యాసముచే
శోభిల్లఁగ నుచ్చారణ
వైభవమున మాటలాడవలయుఁ గుమారా! 74

## పౌరధర్మము.

కం. ఒకభాగము కుళ్లినయెడ
సకలాంగము కుళ్లురీతి సంఘమునకు బా
ధకుఁ డొకఁడుండిన సంఘం
బికఁ జెడు నవ్వాని విడువ హితము కుమారా! 75

కం. తరువును నాకులు శాఖలు
పరస్పరాశ్రయములగుచు వర్తిల్లు నా
తెఱఁగునఁ గుటుంబమున నం
దఱు ననురక్తులుగ న[illegible]వగును గుమారా! 76

కం. జనులెల్ల బ్రహ్మసృష్టినిఁ
జనియించిన వారలగుట సౌభ్రాత్రమునం
గనఁ గావలయును భేదం
బును బాటింపకయు విహితబుద్ధిఁ గుమారా! 77

కం. నోటు రహస్యముగా నిడు
చోటునదైవంబు నిన్నుఁ జూచు చునుండున్
టాటోటుతనముగొననీ
కేటికి ధర్మైక బుద్ధినెసఁగు కుమారా! 89

కం. ఎప్పుడు స్వాతంత్ర్యమునకుఁ
జొప్పడుదువో బాధ్యతలును జొప్పడుదానిన్
మెప్పంగ దీర్పంగ దగుం
దప్పక యద్దాన సుఖము దనరు కుమారా! 90

కం. రాజనఁగ మూర్తిమంతం
బౌ జనసంఘమ్ము వాని యర్చన యనఁ దా
భూజన సమర్చ గావున
రాజుపయిన్ భక్తిఁ జూపు రహిని కుమారా! 91

కం. పలువురు నడచెడుమార్గం
బుల పార్శ్వములందు వృక్షములఁ బెంచుటచే
ఫలమేమనకుము వేసం
గులలో బాంధవులు ముదమ్ముఁగొందు కుమారా! 92

## శరీరారోగ్యము.

కం. శారీరారోగ్యము చె
న్నారుం గద ధర్మసాధనకు సాధకమై
వారలు దానింగాంతురో
వారలకే చిత్తశుద్ధి ప్రబలుఁ గుమారా! 93

కం. స్నానమున రోమకూపము
లోనుండెడు ముఱికి యెల్ల లుప్తమయి సమీ
చీనముగ గాలి జొరబడి
పైనుండి రుధిరమును శుచిపఱచుఁ గుమారా! 94

కం. హాయిగ గాలి చొరఁగ వా
తాయనములు గలిగి ముఱికి యగు గుంటలకున్
బాయుచు దూరంబగు గృహ
మే యావాసింప నీకు హితము కుమారా! 95

కం. శారీర తత్త్వమెల్లను
నారసి యే యే పదార్థ మాదరమౌనో
గోరియు దానిని మెసఁగుము
యారోగ్యము దాన నీకు నగును గుమారా! 96

కం. పాసినది కుళ్ళినది దు
ర్వాసనలం గొట్టునదగు వంటకమును నీ
వే సమయముననుఁ గుడువకు
మా! పసి చెడు దాన నీదు మేను కుమారా! 97

కం. అమలిన జలములనేఁ ద్రా
గుము మద్యాదికము లెపుడు క్రోలకు దానన్
గొమరారెడు నీదేహము
ప్రమత్తమయి కనదు ధర్మరతినిఁ గుమారా! 98

కం. పెందలకడ నిద్రించుట
పెందలకడ మేలు కొనుట పృథు సౌఖ్యంబుం

ఖెందించుఁ గూడ దిఁక రా
త్రిం దివసములను విపరీత రీతి కుమారా! 99

కం. తన స్థితికిఁ దగిన వేషము
తనవేషమునకు సరిగఁ దగిన నడతయున్
గొనవలెను గాని వలవదు
ధనమునఁ గొని గొప్పదుస్తుఁ దాల్పఁ గుమారా! 100

కం. గాలి దగలని విధంబునఁ
గీలులు బిగియించునట్లు కీలింపకు మా
కాలోచితమగు దుస్తులు
వాలాయముగా ధరింపవలయుఁ గుమారా! 101

కం. నలువురు ద్రావెడు జలములఁ
గలుష పఱుపరాదు నేనొకండనె జలముల్
కలుష పఱుపఁ జెడునాయని
దలఁచిన జలమెల్లఁ జెడు సతంబుఁ గుమారా! 102

## ఆర్థికము.

కం. ఏదేశము ధనవంతమొ
యాదేశమునందు జనము లతిసౌఖ్యంబున్
మోదంబుఁ గొందురిగావున
నీదేశము సేయు సిరికి నెలవు కుమారా! 103

కం. జన జీవనమునకును వల
సినపంటలనెల్లఁ బైరుసేసి స్వదేశం

బును దిండికిఁ బరదేశం
బునకై చేయిసాచఁ జేయఁబోకు కుమారా! 104

కం. పండింపు మెల్ల పంటలు
దండిగఁ దినమిగులు దాని ధనమార్జింపన్
ఖండాతరముల కంపియు
ఖండంబగు వెలకునమ్మఁ గడఁగు కుమారా! 105

కం. మనదేశ వస్తువులచే
ననువగు శిల్పములఁ జేసి యల్పులకును జీ
వనమును గల్పించుము దా
నను నీదేశమునఁదగు ధనంబు కుమారా! 106

కం. గనులందుండిన రత్నము
లును మణులను బొగ్గు నితర లోహంబుల బై
కినిఁదీసి విలువఁగనుఁగొని
కొనుమండలి వచ్చు ధనముఁగోరి కుమారా! 107

కం. పరపతి గలుగు విధంబునఁ
జరియింపుము దానివలన సాగును గడుబే
హార మద్దానను దేశము
చిరముఁ ధనవంతమగుచుఁ జెలఁగుఁ కుమారా! 108

## వివిధ విషయములు.

కం. కోపము గలిగిన క్షణమే
యోపికయును శాంతిఁ బాసి యొగిదానిఁ గ్రియా

రూపమునఁ బెట్టఁ బళ్ళా
తాపంబున ద్రుగ్గఁగలవు దాన, కుమారా! 109

కం. అన్నాతురుఁడై యొక్కఁడు
నిన్నడిగిన లేదటంచు నిర్దయతోడన్
నున్నం జుట్టకు నీకడ
నున్న కొలఁది లోన యిడఁగ నొప్పు కుమారా! 110

కం. దానంబు చేయువారల
మానుండని చెప్పుటెంచ మర్యాదా! నీ
హీనత దెలియును నంతే
కాని ఫలంబొండు లేదు గాదె కుమారా! 111

కం. నీగుణము నీవు బొగడుట
బాగగునా? నిన్నుఁజూచి పలువురు నగరా
నీగుణములలోఁ బరులకు
బాగుగనవి నీకు నెఱుక పడునే? కుమారా! 112

కం. లెక్కలును జదువు వ్రాఁతయుఁ
జక్కగ నేర్వంగవలయు సత్యము ధరణిం
బెక్కులు వ్యవహారంబులు
చక్కంబడ వవ్విలేమి సతము కుమారా! 113

కం. యాచన సేయుచు నితరుల
నీచంబగు మార్గమున గణింపకు ధనముల్
యాచన సేయుటకంటెను
నీచేనగు పనినిఁజేసి నెగడు కుమారా! 114

కం. అనుదినమును దైవస్తుతిఁ
జను నొనరింపంగఁ బిదపఁ జదువఁగవలయున్ 11
ఘనులకు జదువే దేవునిఁ
గనఁబఱచెడు సాధనంబు గాదె కుమారా! 115

కం. బందుగులఁ జూచివారల
కుందగు సదుపాయములను గూర్చినయెడలన్
జెందుదు పరమార్థమునీ
కందువలనఁ గీర్తివచ్చు నయ్య కుమారా! 116

కం. జనదు పరోక్షంబున నె
వ్వానినిం దూలంగనాఁడఁ బ్రత్యక్షమునన్
జనుఁ దప్పులున్నఁ జెప్పగ
మనమున నెఱిఁపుచ్చకుండ మహిని కుమారా! 117

కం. ధనము చిరకాలముండదు
ఘనదానమె శాశ్వతంబు గావున నెపుడున్
ధనమునకు దానమేతగు
వినియోగంబంచు వేద విదులు కుమారా! 118

కం. నినుగని పెంచిన జననీ
జనకులయెడ భక్తిఁజూపి సతతము వారల్
ఘనమగునానందంబున
నినుగాంచిన ఫలముచెంద నెగడు కుమారా! 119

కం. నీవేపనిఁజేసిన నీ
జీవితమునకున్ సుఖంబు సిద్ధించునదై
నేవిధినే బరులకు సౌ
ఖ్యావహమై యుండవలయు నద్ది కుమారా! 120

సంపూర్ణము.